# జగద్గురు శ్రీమద్విరాట్ పోతులూరు

# వీరబ్రహ్మేంద్రస్వాములవారి

# పూజా విధానము



**సంకలనము**

బ్రహ్మశ్రీ పదకండ్ల వేంకటాచార్యులు

**శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామివారి పూజా విధానము**

సంకలనము : బ్రహ్మశ్రీ పడకండ్ల వేంకటాచార్యులు, హైదరాబాదు

హక్కులు : ప్రచురణ కర్తవి
ముద్రణ : జూలై 2019
కాపీలు : 1000
వెల : 30/-

ప్రతులకు :
**బ్రహ్మశ్రీ పడకండ్ల వేంకటాచార్యులు**
శ్రీ ఆదిశంకరాచార్యవేదధర్మపీఠమ్
కుంట్లూరు గ్రామము, అబ్దుల్లాపూర్ మెట్ మండలం,
రంగారెడ్డి జిల్లా, తెలంగాణ - 501505.
చరవాణి : 9440932455, 9502054149

ముఖచిత్రం :
**కందేపి వీర వెంకట శ్రీనివాసు**

ముద్రణ :
**ఆల్ఫా గ్రాఫిక్స్,** చరవాణి : 9849315539

## శ్రీ వీరబ్రహ్మేంద్రస్వాములవారి - ద్వాదశ సూక్తులు

1. నా భక్తులకు ఏ ప్రళయములు అంటవు.
2. అస్మద్దివ్యనామ పఠనా పరులై ఆనందానయుండేరు.
3. పోతులూరి వారి భక్తులు జ్యోతి స్వరూపులై యుండేరు.
4. మమ్ములను దూషించినందులకైనా సహించేము. మా భక్తులను దూషించిన సహింపము.
5. నన్ను పూజించినా, నా కాలజ్ఞానమును పారాయణము చేసిన వారికి ఒక పుష్పమిచ్చిన జోడు పుష్పములగును.
6. నిజభక్త హృదయాంతరాళమందు నిలచేము.
7. పుణ్యపురుషులను గురుని చెంతకు చేర్చేము.
8. ధర్మము చేసినవారు, ఒకరిని దూషించని వారు, ఒకరిసొమ్ముకు ఆశపడని వారు నాకత్యంత ప్రీతిపాత్రులు.
9. తోడేకొలది భావిలో నీరు, దానధర్మాలు చేసే కొలది సిరిసంపదలు వృద్ధి చెందుతుంటాయి.
10. నీ గతజన్మ కర్మలే నిన్ను వేధిస్తుంటాయి. నన్నాశ్రయిస్తే అవి మెల్లగా వెనుదిరుగుతాయి.

11. నీ మనస్సును నావైపు మరలిస్తే జ్ఞానప్రదమౌతుంది. లేకుంటే అది అజ్ఞానం పాలౌతుంది.
12. ననాశ్రయించిన వారి సకల బాధ్యతలను నేను నిర్వహింతును.

**మూలమంత్రం :**

ఓం, హ్రీం, క్లీం, శ్రీం, శివాయ బ్రహ్మణేనమః (108 సార్లు జపించాలి)

**గమనిక :** పై ద్వాదశాక్షరీ మంత్రమును 12000 పర్యాయములు ఏకకాలములో జపము చేసిన యెడల స్వామి దర్శనమిస్తారనీ, అష్టఐశ్వర్యములు, మోక్షప్రాప్తి, సిద్ధించగలవని కాల జ్ఞాన ప్రమాణము.

## జగద్గురు శ్రీమద్విరాట్
## పోతులూరు వీరబ్రహ్మేంద్రస్వాములవారి దీక్ష

### వీరబ్రహ్మేంద్ర స్వామి వారి దీక్షా వివరములు

40 రోజుల దీక్ష - 32రోజుల దీక్ష - 21రోజుల దీక్ష - 12 రోజుల దీక్షలు స్వీకరించవచ్చు.

ఈ దీక్షలో పాల్గొనుటకు కుల, మత, స్త్రీ, పురుష వయోభేదము లేదు. దీక్ష పైన ఉదహరించినన్ని దినములు స్వీకరించవచ్చు. చివరి రోజు వైశాఖ శుద్ధ దశమి అగునట్లు చూచుకొనవలెను. ఆనాడు కందిమల్లయ్యపల్లెలోని శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామి మఠము నందు ఆరాధనా గురు పూజా మహోత్సవములు జరుగును, ఆ శుభదినమున దీక్షావిరమణ జరుగవలెను. ఆ ప్రకారముగా మాలాధారణము గావించుకొని దీక్షను ప్రారంభించవలెను. దీక్ష తీసుకొనువారు శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వాములవారి మఠం, మఠాధిపతుల వారిచే గాని, ప్రత్యేకంగా నియమింపబడిన అధ్వర్యుల వారిచేగాని లేదా ముమ్మారు దీక్షపొంది "గురుబ్రహ్మం" అయినవారిచేగాని దీక్ష పొందవలెను.

దీక్షాపరుడు తన దీక్ష ఇరుముడి సామాగ్రితో మఠములో జరుగు ఆరాధన మహోత్సవం నాటికి మఠం వచ్చి స్వామి సజీవ యోగసమాధి దర్శనం చేసుకొని తదుపరి మఠాధిపతుల సమక్షమున వారిచేగాని, వారి అనుమతి పొందిన వారిచేగాని దీక్షా విరమణ చేయించుకొనవలెను.

**దీక్షాధారణము :**

దీక్షాపరుడు ఎరుపు లేక కాషాయరంగు వస్త్రములు ధరించవలెను. ఫాలభాగమున విభూతి పూసుకొనవలెను. నొసట గంధం, కుంకుమ దిద్దుకొనవలెను. మెడలో రుద్రాక్షమాలగాని, తులసిమాలగాని ధరించవలెను.

శ్రీ స్వామివారి పటము లేదా విగ్రహమును ఒకటిన్నర అడుగు చౌకము గల ఎరుపురంగు వస్త్రముపై బియ్యం పరచి ఆ బియ్యంపై "ఓం" కారమును వ్రాయవలెను. దర్భాసనముపై పద్మాసనము వేసుకొని కూర్చొని ఎరుపు రంగు అక్షతలతో శ్రీ స్వాములవారి అష్టోత్తర శతరనామములను పఠించుచు పూజ చేయవలెను.

తదుపరి "ఓం నమో పరబ్రహ్మణే శ్రీ వీరనారాయణాయ స్వాహా" లేక "ఓం నమో వీరబ్రహ్మణే" అను మంత్రమును నూటఎనిమిది పర్యాయములు జపించవలెను. ఈ కార్యక్రమము ప్రతిదినమూ ఉదయం, సాయంకాలము చేయవలెను. ఆ తరువాత విధిగా శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వాములవారి మఠానికిగాని, ఏదైనా దేవాలయమునకు గాని తప్పక వెళ్ళి దైవదర్శనం చేయవలెను.
**"బ్రహ్మం-గురుబ్రహ్మం"** మొదటగా దీక్షపొందిన వ్యక్తిని "బ్రహ్మం" అందురు. ముమ్మారు దీక్ష పొందినవారు "గురుబ్రహ్మం" అగుదురు. దీక్ష పొందినవారిని "బ్రహ్మం" అని పిలువవలెను. దీక్ష పొందినవారు ఇతరులను "బ్రహ్మం" అనియే పిలువవలెను.

**దీక్షా నియమములు :**

1. పాదరక్షలు ధరించరాదు.
2. నేలపై చాపమీదగాని, ఏకవస్త్రము పరచుకొని గాని శయనించవలెను.
3. ప్రతిదినము ఇంటిని శుభ్రపరచి మడిబట్టలు ధరించి వండిన శాఖాహారమునే భుజించవలెను.
4. ఏకభుక్తము మాత్రమే చేయవలెను. రాత్రికి అల్పాహారము స్వీకరించవలెను.

5. అసత్యమాడరాదు. మితముగా మాట్లాడవలెను. "శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామి" నామ స్మరణము చేయుచుండవలెను.
6. దీక్షా కాలమున ప్రతి ఆదివారము గాని, ఒక ఆదివారము గాని ఉదయం 6-00 గం॥ నుండి సా॥ 6-00 గం॥ల వరకు మౌనదీక్ష పాటించవలెను. మౌనదీక్షకు ముందు వెనుక పూజా కార్యక్రమాలు ఆచరించవలెను.
7. బ్రహ్మచర్యము పాటించవలెను.
8. మద్య మాంసాది మత్తు పదార్థాలుస్వీకరించుట, ధూమపానము చేయరాదు.
9. క్షౌరము చేయించుకొనరాదు, గోళ్ళు తీయరాదు. దీక్ష మధ్యలో జాతాశౌచ, మృతాశౌచము సంభవించినయెడల విరమింప చేయవలెను, అవి పూర్తైన వెంటనే పునః మాల ధరించి దీక్ష చేసుకొనవచ్చును.
10. దీక్షాదారులకు కుల, మత, స్త్రీ, పురుష వయో భేదము లేదు. బ్రహ్మం శరణం శరణం బ్రహ్మం, సద్గురు శరణం బ్రహ్మం శరణం, బ్రహ్మంశరణం వీరబ్రహ్మం అని నిరంతర జపం చేస్తూ ఉండవలెను.

**సత్సంగము :**

దీక్ష పొందినవారు నియమిత కాలమున ఒక చోట చేరి సత్సంగము నందు పాల్గొనవలెను. ఈ సమయములో శ్రీ వీరబ్రహ్మ భజన చేయవలెను. బ్రహ్మంగారి చరిత్ర పారాయణమునకు కొన్ని బ్రహ్మనామ చరణములు ఇవ్వబడినవి. మరికొన్ని తయారు చేసుకొని పారాయణము చేసుకొనవచ్చును.

**ఇరుముడి :**

దీక్షాపరులు స్వామివారి మహానైవేద్యమునకు అవసరమయ్యే బియ్యం, బెల్లము, ఎండు కొబ్బరి, నెయ్యి ఇతర సుగంధ ద్రవ్యములు, తగు దక్షిణతో ఇరుముడి కట్టుకొని వచ్చి విరమణ సమయములో మహానివేదన "మందిరము" నందు ఇరుముడి సామాగ్రి సమర్పించవలెను.

**గమనిక:** దీక్ష ఎవరి శక్త్యానుసారంగా దీక్ష విరమణ జరుగునట్లు స్వీకరించగోరుచున్నాము. భక్తాదులు ఈ దీక్షా కార్యక్రమమునందు విరివిగా పాల్గొని శ్రీ వీరబ్రహ్మేంద్ర భగవానుని కృపకు పాత్రులు కాగలరని మనవి.

## శ్రీగోవిందమాంబా సమేత జగద్గురు శ్రీమద్విరాట్ పోతులూరు వీర బ్రహ్మేంద్ర స్వామి పూజా విధానము

శ్రీ స్వామి వారి పూజ నిర్వహించు గృహమునందు పూజాస్థలమును శుభ్రపరచి తూర్పు లేదా ఉత్తరం వైపు గోడకు గాని లేదా ఆదిక్కులకు ముఖం ఉండునట్లు  కర్త కూర్చొని వస్త్రముపరచి, అర్చన చేయుటకు వీలుగా స్వామివారి చిత్రపటమును ఉంచి విభూతి, గంధం, కుంకుమ, పూలమాలతో అలంకరించి తదుపరి ఒక చిన్న పళ్ళెరంలో బియ్యము పోసి ఆ బియ్యముపై ఒక తమలపాకును తూర్పు లేదా ఉత్తరములకు కొన ఉండునట్లు ఉంచి పీఠమునకు రెండు వైపులా దీపారాధన కుందులు పూజా ద్రవ్యములన్నింటినీ సిద్ధపరచుకొని ప్రశాంతత కలిగి పూజకు ఉపక్రమించవలెను.

**గురు ప్రార్థన :**

ఓం శ్రీగురుభ్యోనమః హరిః ఓమ్

శ్లో॥ గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః ।
గురుస్సాక్షాత్ పరంబ్రహ్మ తస్మై శ్రీ గురవేనమః ॥

శ్లో॥ అఖండ మండలాకారం వ్యాప్తం యేన చరాచరమ్ ।
త్వత్పదం దర్శితంయేన తస్మైశ్రీ గురవేనమః ॥

శ్లో॥ మన్నాథా శ్రీజగన్నాధా మద్గురు శ్రీ జగద్గురు ।
మమాత్మా సర్వ భూతాత్మా తస్మైశ్రీ గురవేనమః ॥

శ్లో ॥ అజ్ఞాన తిమిరాంధస్య జ్ఞానాంజన శలాకయా ।
చక్షురోన్మీలితంయేన తస్మైశ్రీ గురవే నమః ॥

శ్లో ॥ బ్రహ్మానందం పరమ సుఖదం కేవలం జ్ఞానమూర్తిం ।
విశ్వాతీతం గగన సదృశం తత్వ మస్యాదిలక్ష్యం ॥
ఏకం నిత్యం విమల మచలం సర్వదీ సాక్షి భూతం ।
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తంనమామి ॥

శ్లో ॥ శుక్లాంబరధరంధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం ।
ప్రసన్నవదనం ధ్యాయే స్సర్వ విఘ్నోప శాంతయే ॥

**ఘంటా నాదం:**

ఓం ఆగమార్ధంతు దేవానాం గమనార్ధంతు రాక్షసామ్।
కురు ఘంటారవం తత్ర దేవతాహ్వాన లాంఛనమ్ ॥

**దీపం :**

ఓం ఉద్దీప్యస్య జాత వేదో పఘ్న నిర్ రుతిం మమ ।
పశూగ్ంశ్చ మహ్యామావహ జీవనంచ దిశోదిశ ॥

ఓం దీపంజ్యోతి పరంబ్రహ్మ దీపం సర్వ తమోపహమ్
దీపేన సాధ్యతే సర్వం సంధ్యా దీపం నమోస్తుతే ॥

(దీపం వద్ద అక్షతలు, పుష్పము ఉంచి నమస్కరించవలెను)

**పవిత్రీకరణ :**

ఓం అపవిత్రః పవిత్రోవా సర్వావస్థాం గతోపివా ।
యస్మరే ద్విశ్వకర్మాణం సబాహ్యాభ్యంతర శ్శుచిః ॥

(తమలపాకుతో నీటిని ముమ్మారు శిరస్సు పైన, ప్రక్కన చల్లుకోవలెను)

**ఆచమనీయము :**

ముందుగా ఎడమచేతితో ఉద్ధరిణెను పట్టుకొని కుడి చేతిలోనికి నీరు ఉంచుకొని హస్తమును కడిగినట్లుగా నీటిని ప్రక్కన వదలాలి. తదుపరి మొదట మంత్రం చెప్పి కుడిచేతిలోని ఒక ఉద్దరణెడు నీరు తీసుకొని స్వాహా అనునపుడు త్రాగాలి. నీటిని పుచ్చుకొనునపుడు శబ్దం రాకూడదు తదుపరి మరలా చేతిని కడుగు తున్నట్లుగా భావించి ఉద్ధరిణెడు జలం ప్రక్కనవదలి తదుపరి నామావళి ఉచ్ఛరిస్తూ నమస్కరించుకోవాలి.

| | |
|---|---|
| 1. ఓం విశ్వకర్మణే స్వాహా | 13. ఓం సవిత్రే నమః |
| 2. ఓం సనాతనాయ స్వాహా | 14. ఓం లోకేశాయ నమః |
| 3. ఓం జగన్మయాయ స్వాహా | 15. ఓం అధోక్షజాయ నమః |
| 4. ఓం బ్రహ్మణే నమః | 16. ఓం శంకరాయ నమః |
| 5. ఓం అచ్యుతాయ నమః | 17. ఓం జిష్ణవే నమః |
| 6. ఓం సర్వజ్ఞాయ నమః | 18. ఓం పూష్ణే నమః |
| 7. ఓం శునాశీరాయ నమః | 19. ఓం ప్రజాపతయే నమః |
| 8. ఓం వికర్తనాయ నమః | 20. ఓం విష్ణవే నమః |
| 9. ఓం పరమేష్ఠినే నమః | 21. ఓం శివాయ నమః |
| 10. ఓం జనార్దనాయ నమః | 22. ఓం వాస్తోష్పతయే నమః |
| 11. ఓం వామదేవాయ నమః | 23. ఓం కర్మ సాక్షిణే నమః |
| 12. ఓం మఘవతే నమః | 24. ఓం స్వయం భూ విశ్వకర్మణే నమః |

**భూతోచ్చాటనము:**

ఉత్తిష్ఠంతు భూత పిశాచాః ఏతే భూమిభారకాః ।
ఏతేషా మవిరోధేన బ్రహ్మకర్మ సమారంభే ॥

(అక్షతలు ఈ మంత్రంతో మంత్రించి వెనుక, ప్రక్కన చల్లవలెను)

**ప్రాణయామము :**

(శరీరంలోని చెడు వాయువులను బయటకు పంపి ప్రాణ వాయువును క్రమ పద్ధతిలో స్వీకరించుట దీనిలోని పరమార్ధం)

ఓంభూః, ఓం భువః, ఓగుంసువః, ఓంమహః, ఓంజనః, ఓంతపః, ఓగ్ంసత్యం

(అని ఉచ్చరించి ముక్కు ఎడమ రంధ్రం నుండి గాలిని లోనికి పీల్చవలెను)

ఓం తత్సవితుర్వ రేణ్యం భర్గోదేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్.

(పై మంత్రమును అనుకుంటూ పీల్చిన గాలిని బంధించవలెను)

ఓం ఆపోజ్యోతి రసోమృతం బ్రహ్మభూర్భు వస్సువరోమ్॥

(పై మంత్రం అనుకుంటూ ముక్కు కుడి రంధ్రము నుండి బంధించిన గాలిని నెమ్మదిగా వదల వలెను పై మూదుపద్ధతులు ముమ్మారు చేయాలి.)

**సంకల్పము :**

శుభే శోభనే ముహూర్తే శ్రీ మహా విశ్వకర్మాజ్ఞయా ప్రవర్తమానస్య అద్య బ్రహ్మణః ద్వితీయ పరార్ధే కశ్యప బ్రహ్మకల్పే వైవస్వత మన్వంతరే కలియుగే ప్రథమ పాదే జంబూద్వీపే, భరతవర్షే, భరత ఖండే మేరోర్దక్షిణ దిగ్భాగే శ్రీ శైలస్య ...(1)...ప్రదేశే

...(2)...మధ్య ప్రదేశే ...(3)... గృహే సమస్త దేవతా బ్రాహ్మణ గురుచరణ సన్నిధౌ అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్ర మానేన స్వస్తిశ్రీ ...(4)...నామసంవత్సరే ...(5)... ఆయనే ... (6)... ఋతౌ ...(7)... మాసే ...(8)... పక్షే ...(9)... తిథౌ ...(10)... వాసరే ...... శుభనక్షత్రే .... శుభయోగే శుభకరణే ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ, శ్రీమాన్ శ్రీమతః ....(11)... గోత్రస్య ...(12)... నామధేయస్య ధర్మపత్నీ సమేతస్య అస్మాకం సహకుటుంబానాం క్షేమ, స్థైర్య, ధైర్య, విజయ, అభయ, ఆయురారోగ్య ఐశ్వర్యాభి వృధ్యర్థం. ధర్మార్థ, ఐశ్వర్య కామ్య మోక్ష పంచ విధ ఫల పురుషార్థ సిధ్యర్థం, లోక కళ్యాణార్థం శ్రీ గోవింద మాంబా సమేత శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామి ప్రీత్యర్థం. యావశ్చక్తి ధ్యానావాహనాది షోడశోపచార పుజాం కరిష్యే ఆదౌ నిర్విఘ్నేన పరిసమాప్త్యర్థం. శ్రీమహా గణాధి పతి పూజాం కరిష్యే తదంగ కలశారాధనం కరిష్యే.

**పై సంకల్పంలోని ఖాళీలలోని సంఖ్యల వివరములు గమనించండి.**

**1వ ఖాళీ వివరం:** ఈ ఖాళీలో మనం శ్రీశైల మునకు ఏదిక్కున పూజ చేయు చున్నామో ఆదిక్కును ఇచ్చట చెప్పుకొనవలెను. ఉదా: గుంటూరు ప్రాంతంవారైతే శ్రీశైలస్య ఈశాన్య ప్రదేశే అనియు,

హైదరాబాద్ ప్రాంతం వారైతే శ్రీశైలస్య వాయువ్యప్రదేశే అనీ, కడప తిరుపతి జిల్లాల వారైతే శ్రీశైలస్య ఆగ్నేయ ప్రదేశే అనీ ఇలా మార్పు చేసుకోని చెప్పుకోవాలి.

**2వ ఖాళీ వివరం:** పూజ నిర్వహించు చున్న ప్రదేశం. ఏ రెండు నదుల మధ్య నున్నదీ చెప్పుకొనవలెను. ఉదా: గుంటూరు, మార్కాపురం, నెల్లూరు, నంద్యాల, తిరుపతి, అనంతపురం జిల్లాల వారు కృష్ణా కావేర్యోర్మధ్య ప్రదేశేఅనీ, కాకినాడ, రాజమండ్రి, భద్రాచలం, పట్టణాల ప్రాంతం వారు గంగా, గోదావర్యోర్మధ్యప్రదేశే అనీ, ఏలూరు, హైదరాబాద్, విజయవాడ, వరంగల్ ప్రాంతం వారు. కృష్ణా గోదావర్యోర్మధ్య ప్రదేశే అని చెప్పుకోవాలి.

**3వ ఖాళీ వివరం:** ఇల్లు. స్వంత ఇంటిలో పూజ చేయుచున్నచో స్వగృహే అనీ, అద్దె ఇల్లు అయితే వసతి గృహే అనీ దేవాలయ సన్నిధిలో అయితే ఆదేవాలయ స్వామి వారి చరణ సన్నిధౌ అని చెప్పుకొనవలెను.

**4వ ఖాళీ వివరం:** మీరు పూజ చేయుచున్న సంవత్సరం పేరు ఈ ఖాళీలో చెప్పవలెను. ఇది పంచాంగం ద్వారా లేదా క్యాలెండర్ ద్వారా తెలుసుకోవాలి. మన సంవత్సరముల పేర్లు 60 కలవు. ప్రస్తుత సంవత్సరం పేరు చెప్పుకోవాలి.

**5వ ఖాళీ వివరం:** జనవరి 14 నుండి జులై15 వరకు ఉత్తరాయణే అనీ, జులై 16 నుండి జనవరి 13 వరకు దక్షిణాయనే అని చెప్పుకోవాలి.

**6వ ఖాళీ వివరం:** ఋతువు పేరు. మనకు ఋతువులు ఆరు కలవు. అందు చైత్ర, వైశాఖములు – వసంత ఋతౌ అనీ, జ్యేష్ట, ఆషాఢములు –గ్రీష్మ ఋతౌఅనీ, శ్రావణ, భాద్రపదములు – వర్ష ఋతౌ అనీ, ఆశ్వీయుజ, కార్తీకములు – శరద్ ఋతౌ అనీ, మార్గశిర, పుష్యములు – హేమంత ఋతౌ అనీ, ఇందు ఏ ఋతువు ఐతే ఆ ఋతువు పేరు అని చెప్పుకోవాలి

**7వ ఖాళీ వివరం:** అంకె ఉన్నచోట : చైత్ర, వైశాఖ, జ్యేష్ఠ, ఆషాఢ, శ్రావణ, బాధ్రపద, ఆశ్వయుజ, కార్తిక, మార్గశిర, పుష్య, మాఘ, ఫాల్గుణ మాసములలో ఏ మాసంలో మనం పూజ చేయుచున్నామో ఆమాసం పేరు చెప్పవలెను. ఉదా : కార్తీక మాసే అనవలెను.

**8వ ఖాళీ వివరం:** పక్షే, మాసమునకు రెండు పక్షములు ఉండును. అందు పూర్ణిమకు ముందున్న 15 రోజులను శుక్ల పక్షే అనీ పూర్ణిమ తరువాత అమావాస్యకుముందున్న 15 రోజులలో బహుళపక్షే అనీ చెప్పవలెను.

**9వ ఖాళీ వివరం:** తిథౌ అనుదానికి పూజ చేయుచున్నరోజు తిధిని చూచుకోని ఆ తిధిని చెప్పవలెను. క్యాలెందరులో తిధివెళ్ళిపోయే సమయం అనగా చివరి సమయం వేయుదురు గమనించాలి. ఉదా: పంచమి తిథౌ అని చెప్పుకోవలెను.

**10వ ఖాళీ వివరం:** వాసరే అనునప్పుడు: మనకు వారమునకు 7 రోజులు. ఆ రోజుల పేర్లు తెలుగులో చెప్పుకుంటూ అంటాము కానీ అవి సంస్కృతము లోనే చెప్పాలి కనుక ఆదివారమునకు – భానువాసరే అనీ సోమవారమునకు ఇందువాసరే అనీ మంగళవారమునకు – భౌమవాసరే అనీ బుధవారమునకు – సౌమ్యవాసరే అనీ గురువారమునకు బృహస్పతివాసరే అనీ శుక్రవారమునకు – భృగువాసరే అనీ శనివారమునకు – మందవాసరే అనీ ఈ విధంగా చెప్పుకోవాలి.

**11వ ఖాళీ వివరం:** ఈ సంఖ్య వద్ద పూజ చేయుచున్న వారి గోత్రం చెప్పాలి.

**12వ ఖాళీ వివరం:** ఈ సంఖ్య వద్ద పూజ చేయుచున్న వారి పేరు చెప్పుకోవాలి. తర్వాత మనసులో ఉన్న కోరికను స్వామికి మనఃపూర్వకంగా లోలోపల అనుకొనవలెను. తదుపరి సంకల్పమును పూర్తిగా చెప్పవలెను. చివర కరిష్యే అని పలికినపుడు (కలశమును తాకవలెను).

**కలశపూజ :**

శ్లో ॥ కలశస్య శివః పూర్వే దక్షిణేతు హరిస్మృతః ।
వేదాస్తు పశ్చిమేభాగే చోదీచ్యాం మఘవాస్థితః ।
భాస్కర స్థూర్ధ్వ భాగేతు మధ్యే బ్రహ్మగణ స్మృతః ।
కుక్షౌతు సాగరాస్సర్వే నదీనద సమన్వితాః ।
ఋగ్వేదోఽథ యజుర్వేద సామవేదో హ్యథర్వణః ।
ప్రణవాఖ్యశ్చతే , వేదాః కలశాంబు సమాశ్రితాః ॥

(పై మంత్రముతో ఆచమన పాత్రకు గంధము కుంకుమ బొట్టు పెట్టవలెను)

**జలప్రార్ధన :**

ఓం ఆకలశేషు ధాపతి , పవిత్రే పరీషిచ్యతే ఉగ్థైర్ యజ్ఞేషు వర్ధతే అపోవా ఇదగ్ం సర్వం విశ్వభూతాన్యాపః , ప్రాణావా ఆపః పశవ ఆపోఽన్నమాపో అమృత మాపస్సమ్రాడాపో విరాడాప స్స్వరాడాపశ్ఛందాగ్ ష్యాపో జ్యోతీగ్ష్యాపో యజూగ్ష్యాప స్సత్య మాప స్సర్వా దేవతా అపోభూర్భువస్సువరాప ఓమ్.

(కలశమందలి జలములో పుష్పముంచవలెను)

**నదీప్రార్ధన :**

(ఆచమన పాత్రలోని జలమును తమలపాకుతో ముమ్మారు కదిలించవలయును)

శ్లో॥ గంగేచ యమునే కృష్ణే గోదావరి సరస్వతి, నర్మదే సింధు కావేరి జలేస్మిన్ సన్నిధిం కురు॥

ఆయాంతు శ్రీ గోవింద మాంబాసమేత శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామి పూజార్ధం, మమ దురితక్షయ కారకాః కలశోదకేన పూజా ద్రవ్యాణి సంప్రోక్ష్య దేవం ఆత్మానంచ సంప్రోక్ష్య

పై వచనం పలుకుతూ కలశంలోని నీటిని తమలపాకుతో పూజా ద్రవ్యముల పైన, స్వామివారిపై, శిరస్సుపై చల్లుకొనవలెను.

**గణపతిప్రార్ధన :**

శ్లో ॥ విఘ్నధ్వాంత నివారణైక తరణి ర్విఘ్నాటవీ హవ్యవాట్।
విఘ్నవ్యాళ కులస్య మత్తగరుడో విఘ్నేభపంచాననః ॥
విఘ్నోత్తుంగగిరిప్రభేదన పవిర్విఘ్నాబ్ధి కుంభోద్భవో ।
విఘ్నాఘౌఘ ఘనప్రచండ పవనో విఘ్నేశ్వరః పాతు మామ్॥

ఓం గణానాంత్వా గణపతిగ్ం హవామహే కవింకవీనా
ముప మశ్రవస్తమం జ్యేష్ఠ రాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత
ఆనశృణ్వన్నూతిభిస్సీత సాదనమ్ ॥

శ్రీ మహాగణాధిపతయే నమః ధ్యాయామి ధ్యానం సమర్పయామి।

(గణపతి పై అక్షతలు ఉంచి నమస్కారం చేసుకోవాలి)

శ్రీ మహాగణాధిపతయే నమః ఆవాహయామి. ఆసనం సమర్పయామి.

(గణపతిపై అక్షతలు ఉంచి నమస్కరించవలెను)

శ్రీ మహాగణాధిపతయేనమః శుద్ధోదక స్నానం సమర్పయామి

(గణపతిపై తమలపాకుతో నీటిని చల్లవలెను)

శ్రీ మహాగణాధిపతయే నమః వస్త్ర యుగ్మం సమర్పయామి.

(వస్త్రము,లేదా దూదికి పసుపు అద్ది సమర్పించవలెను)

శ్రీ మహాగణాధిపతయే నమః గంధం సమర్పయామి.

(శ్రీగణపతిపై గంధం తిలకరించండి)

శ్రీ మహాగణాధిపతయే నమః కుంకుమ సమర్పయామి.

(శ్రీగణాధిపతికి కుంకుమ బొట్టు పెట్టండి).

శ్రీ మహాగణాధిపతయే నమః యజ్ఞోపవీతం సమర్పయామి.
(గణపతి పై అక్షతలు ఉంచి నమస్కారం చేసుకోవాలి)
శ్రీ మహాగణాధిపతయే నమః పత్రపుష్పాణి సమర్పయామి.
(గరిక మరియు పుష్పములు అర్పించి నమస్కరించవలెను).
శ్రీ మహాగణాధిపతయే నమః అక్షతాన్ సమర్పయామి.
(అక్షతలు ఉంచి నమస్కరించండి.)
శ్రీ మహాగణాధిపతయే నమః ధూపమాఘ్రాపయామి.
(అగరుబత్తీలు వెలిగించి / ధూపం చూపండి).
శ్రీ మహాగణాధిపతయే నమః దీపం దర్శయామి
(ధీపారాధన వద్ద పుష్ప, అక్షతలుంచి నమస్కరించవలెను.)
శ్రీ మహాగణాధిపతయే నమః ఫల/మధుర, నైవేద్యం సమర్పయామి.
(ఫలము లేదా తీపి పదార్ధములు సమర్పించండి )
శ్రీ మహాగణాధిపతయే నమః ఫల సహిత తాంబూలం సమర్పయామి
(శ్రీగణపతి వద్ద తాంబూలం ఉంచి నమస్కరించండి.)
శ్రీ మహాగణాధిపతయే నమః నీరాజనం సమర్పయామి.
(హారతి ఇచ్చి నమస్కరించండి.)

శ్రీ మహాగణాధిపతయే నమః సువర్ణ దివ్య మంత్రపుష్పసహిత ఆత్మప్రదక్షిణ త్రయ నమస్కారం సమర్పయామి నమస్కారయామి.

(అక్షతలు ఉంచి నమస్కరించవలెను.)

అనయా ధ్యానా వాహనాది షోడశోపచార పూజయాచభగవాన్ సర్వాత్మకః శ్రీ మహాగణాధిపతయే నమః సుప్రీతో సుప్రసన్నో వరదో భవతు ఉత్తరే శుభకర్మణి అవిఘ్నమస్తు.

కొంచెంఅక్షతలు ఉద్ధరిణెడు నీరు కలిపి. ఉత్తరం వైపు తమలపాకు వేసి అందు ఒకేసారి వదల వలెను.

శ్రీమహాగణాధిపతి ప్రసాదం శిరసా గృహ్ణామి అని గణపతి వద్ద పూజించి ఉన్న అక్షతలను కొంచెం శిరస్సున, పుష్పమును చెవి వద్ద ధరించవలెను.

శ్రీ మహాగణాధిపతిం యధాస్థాన ముద్వాసయామి పునరాగమనాయచ" అని గణపతి ఉన్న ఆకును తూర్పునకు కొంచెం కదిలించవలెను.

## శ్రీవీరబ్రహ్మేంద్ర స్వామి వారి ప్రాణప్రతిష్ఠ :

ఓం అసునీతే పునరస్మాసు చక్షుః పునః ప్రాణ మిహనో దేహిభోగం జ్యోక్పశ్యేమ సూర్య ముచ్చరంత మనుమతే అమృళయానస్స్వస్తి. అమృతం వైప్రాణా అమృత మాపః ప్రాణానేవ, యధాస్థానముపహ్వయతే.

శ్రీ గోవిందమాంబాసమేత శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామినేనమః స్థిరోభవ, వరదోభవ, సుముఖోభవ, సుప్రసన్నోభవ, స్థిరాసనం కురు.

పైమంత్రముతో స్వామి వారిపై తమలపాకును బోర్లించి పట్టుకొని నమః అన్నప్పుడు అక్షతలు ఉంచి నమస్కారం చేయవలెను.

అస్యశ్రీ వీరనారాయణ దేవతా మహామంత్రస్య పరబ్రహ్మఋషిః దైవీగాయత్రీఛందః శ్రీ వీరనారాయణో దేవతా హ్రాం బీజం, హ్రీం శక్తిః, హ్రూంకీలకం, శ్రీ వీరనారాయణదేవతా పూజా ఫలప్రసాద సిద్ధ్యర్థే పంచామృతాభిషేకేవినియోగః

**అంగ్యాస కరన్యాసములు :**

| | | | |
|---|---|---|---|
| ఓంహ్రాం | – అంగుష్ఠాభ్యాంనమః | ఓంహ్రాం | – హృదయాయనమః |
| హ్రీం | – తర్జనీభ్యాంనమః | హ్రీం | – శిరసే స్వాహా |
| హ్రూం | – మధ్యమాభ్యాంనమః | హ్రూం | – శిఖాయైవషట్ |
| హ్రైం | – అనామికాభ్యాంనమః | హ్రైం | – కవచాయహుం |
| హ్రౌం | – కనిష్ఠికాభ్యాంనమః | హ్రౌం | – నేత్రత్రయాయవౌషట్ |
| హ్రః | – కరతలకరపృష్ఠాభ్యాంనమః | హ్రః | – అస్త్రాయఫట్ |

ఓం భూర్భువస్సువరోమితి దిగ్బంధః

**ధ్యానమ్ :**

శ్లో ॥ వీరం వీరభయాదితత్వ భరితం వీరాసనస్థం గురుమ్ ।
వీరశ్రేష్ఠ నుతం విరించి వినుతం వీరాధివీరం హరిమ్।
వీరేంద్రం ఘనయోగి మానసచరం వేదాంత విద్యాకృతిమ్।
వీరాచార్య మహంభజామి సతతం శ్రీ వీరనారాయణమ్॥
విరాట్పద విఖ్యాత స్సిద్ధానంద ప్రదాయకమ్ ।
కాలజ్ఞాన ప్రవక్తారం వీరబ్రహ్మగురుంభజే ॥
దేవ దేవీ మహాదేవీ జగన్మాతృ స్వరూపిణీ ।
వీరబ్రహ్మేంద్ర వామాంకే గోవిందాంబానమోస్తుతే ॥

## పంచామృతస్నానం :

ఓం ఆప్యాయస్వ సమేతుతే విశ్వతస్సోమ వృష్ణియం భవా వాజస్య సంగధే॥
శ్రీ గోవిందమాంబాసమేత శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామినేనమః
క్షీరేణస్నపయామి॥ (పాలు)

ఓం దధిక్రావుణ్ణో అకారిషం జిష్ణోరశ్వస్య వాజినః ।
సురభినో ముఖాకరత్ ప్రణ ఆయూగ్ం షితారిషత్ ॥
శ్రీ గోవిందమాంబాసమేత శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామినేనమః
దధ్నాస్నపయామి॥ (పెరుగు)

ఓం శుక్రమసి జ్యోతిరసి తేజోసి దేవోవస్సవితోత్పునా
త్వచ్ఛిద్రేణ పవిత్రేణ వసోస్సూర్యస్య రశ్మిభిః ॥
శ్రీ గోవిందమాంబాసమేత శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామినేనమః
ఆజ్యేన స్నపయామి ॥ (నేయి)

ఓం మధువాతా ఋతాయతే మధుక్షరంతి సింధవః ।
మాధ్వీర్నస్సంతు ఓషధీః । మధు నక్తముతోషసి మధుమత్పార్థివగ్ం రజః। మధు ద్యౌరస్తునః పితా। మధుమాన్నోవనస్పతిః మధుమాగ్ం అస్తుసూర్యః। మాధ్వీర్ గావోభవంతునః ॥

శ్రీ గోవిందమాంబాసమేత శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామినేనమః
మధునా స్నపయామి. (తేనె)

ఓం స్వాదుః పవస్వ దివ్యాయజన్మనే స్వాదురింద్రాయ సుహవేతునామ్నే । స్వాదుర్మిత్రాయ వరుణాయ వాయవే బృహస్పతయే మధమాగ్ం అదాభ్యః ॥
శ్రీ గోవిందమాంబాసమేత శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామినేనమః
శర్కరేణ స్నపయామి ॥ (చక్కెర)

ఓం యాఃఫలినీర్యాఅఫలా అపుష్పాయాశ్చ పుష్పిణీః ।
బృహస్పతి ప్రసూతాస్తానోముంచం త్వగ్ంహసః ॥
శ్రీ గోవిందమాంబాసమేత శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామినేనమః
ఫలోదకేన స్నపయామి ॥ (కొబ్బరి నీరు)

## స్నానం :

ఓం ఆపోహిష్ఠామ యోభువఃతాన ఊర్జేదధాతన మహేరణాయ చక్షసే । యోవశ్శివతమోరసః । తస్య భాజయతే హనః । ఉశతీరివ మాతరః తస్మా అరంగ మామవో । యస్యక్షయాయ జిన్వధ ఆపోజనయ థాచనః ॥

శ్రీ గోవిందమాంబాసమేత శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామినేనమః శుద్ధోదక స్నానం సమర్పయామి ॥

(పై మంత్రముతో తమలపాకుతో స్వామి వారిపై నీటినిచల్లాలి.)

**వస్త్రం :**

ఓం అభివస్త్రా సువసనా న్యృషాభిధేనూ స్సుదుఘాః పూయమానః అభిచంద్రా భర్త వేనో హిరణ్యాభ్యశ్వాన్ రథినో దేవసోమ॥. శ్రీ గోవింద మాంబాసమేత శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామినే నమః వస్త్రయుగ్మం సమర్పయామి పై మంత్రముతో స్వామి వారికి నూతన వస్త్రం సమర్పించాలి . లేదా వస్త్ర యుగ్మార్థం అక్షతాన్ సమర్పయామి అని అక్షతలు ఉంచి నమస్కరించాలి.

**యజ్ఞోపవీతం :**

ఓం యజ్ఞోపవీతం పరమం పవిత్రం ప్రజాపతేర్యత్సహజం పురస్తాత్ ఆయుష్య మగ్ర్యం ప్రతి ముంచ శుభ్రం యజ్ఞోపవీతం బలమస్తు తేజః ॥

శ్రీ గోవిందమాంబాసమేత శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామినేనమః యజ్ఞోపవీతం సమర్పయామి.

పై మంత్రముతో యజ్ఞోపవీతము స్వామి వారికి ధరింప చేయవలెను. లేదా ప్రత్తితో చేసిన దారమునకు గంధం, కుంకుమ, బొట్టు పెట్టి స్వామికి ధరింపచేయాలి. అక్షతలు ఉంచి నమస్కరించాలి.

**విభూతి :**

శ్లో ॥ శ్రీకరంచ పవిత్రంచ రోగ శోక నివారకమ్ । లోక వశీకరం పుణ్యం భస్మం త్రైలోక్య పావనమ్ ॥

శ్రీ గోవిందమాంబా సమేత శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామినేనమః విభూతిం సమర్పయామి.

స్వామి వారిపై విభూతి తిలకరించవలెను లేదా బొట్టు పెట్టవలెను.

**గంధం :**

శ్లో॥ ఓంగంధద్వారాం దురాధర్షాం నిత్యపుష్టాం కరీషిణీం। ఈశ్వరీగ్ం సర్వ భూతానాం తామిహోపహ్వయేశ్రియమ్ ॥ శ్రీ గోవిందమాంబా సమేత శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామినే నమః శ్రీ గంధం సమర్పయామి. పై మంత్రముతో స్వామివారికి గంధమును సమర్పించి నమస్కరించాలి.

**కుంకుమ :**

ఓం కుంకుమం శోభనం దివ్యం సర్వదా మంగళప్రదమ్। మయానీతం మహాదేవా తుభ్యం దాస్యామి సుందరా ॥ శ్రీ గోవిందమాంబా సమేత శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామినే నమః కుంకుమాన్ ధారయామి.

పై మంత్రముతో స్వామవారికి కుంకుమ బొట్టు పెట్టవలెను.

**అక్షతలు :**

ఓం ఆయనేతే పరాయణే దూర్వారోహంతు పుష్పిణీః హ్రదాశ్చ పుండరీకాణి సముద్రస్య గృహా ఇవే శ్రీ గోవిందమాంబాసమేత శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామినే నమః అక్షతాన్ సమర్పయామి. పై మంత్రముతో భగవంతునికి ఎర్రనిఅక్షతలు సమర్పించి నమస్కరించవలెను.

**ద్వాత్రింశన్నామ పుష్ప, అంగపూజ :**

1) ఓం వీరాయ నమః పాదౌ–పూజయామి (పాదములు)
2) ఓం వీరాసనాస్థాయ నమః–గుల్ఫౌపూజయామి (చీలమండలం)
3) ఓం వీరబ్రహ్మణే నమః – జంఘే పూజయామి (పిక్కలు)

4) ఓం వీరాధివీరాయ నమః – జానునీ పూజయామి (మోకాలు)
5) ఓం వీరేంద్రాయ నమః – ఊరూ పూజయామి (తొడలు)
6) ఓం వేదాంత వేద్యాయ నమః – కటిం పూజయామి (మొల)
7) ఓం వేద గోచరాయ నమః – గుహ్యం పూజయామి (పురీషం)
8) ఓం వీరాగ్రగణ్యాయ నమః – మేఢ్రం పూజయామి (బొడ్డుక్రింద)
9) ఓం ఆదిమధ్యాంతరహితాయనమః నాభిం పూజయామి (బొడ్డు)
10) ఓం సూర్య మండల మధ్యవర్తినే నమః – ఉదరం పూజయామి (పొట్ట)
11) ఓం సూర్యనారాయణాయ నమః – వక్షస్థలం పూజయామి (హృదయభాగం)
12) ఓం సర్వ వ్యాపినే నమః – పార్శ్వౌపూజయామి(ఇరుభాగములు)
13) ఓం సర్వ తీర్థగోచరాయ నమః –హృదయం పూజయామి (గుండె)
14) ఓం పరతత్వాయ నమః – కంఠం పూజయామి (కంఠం)
15) ఓం పరమ పురుషాయ నమః – స్థనౌ పూజయామి (చనులు)
16) ఓం త్రయీమయాయ నమః – హస్తాన్ పూజయామి (చేతులు)
17) ఓం జ్యోతిర్మయాయ నమః – బాహూన్ పూజయామి (భుజములు)
18) ఓం వరదాయ నమః – కంఠస్థలం పూజయామి(మెడ)
19) ఓం చతుర్విధ మోక్ష ఫలప్రదాయ నమః – ఛుబుకం పూజయామి (గడ్డం)
20) ఓం అభేద్యాయ నమః – ముఖం పూజయామి (ముఖం)

21) ఓం అనంతాయ నమః – ఓష్ఠౌ పూజయామి (పెదవులు)

22) ఓం ఆశ్రిత పారిజాతాయ నమః – దంతాన్ పూజయామి(దంతములు)

23) ఓం ఉత్పత్తి స్థితిలయ హేతుభూతాయ నమః – కర్ణౌ పూజయామి (చెవులు)

24) ఓం మహాలక్ష్మీ ప్రదాయ నమః – నాసికాంపూజయామి (ముక్కు)

25) ఓం సాంద్ర సింధు వేదాయ నమః – నేత్రౌ పూజయామి (కండ్లు)

26) ఓం ఆనందాశ్రమ ఆశ్రయాయనమః – భృకుటిం (కనుబొమలు)

27) ఓం శ్రీవీరధర్మజ స్వామినే నమః – లలాటం పూజయామి(నుదురు)

28) ఓం శ్రీవీర గురు పరబ్రహ్మణే నమః – ఫాలభాగం (నుదుటిపైభాగం)

29) ఓం వీరాచార్యాయ నమః – శిరఃపూజయామి (తల)

30) ఓం కాలజ్ఞాన విదితాయ నమః – కేశాన్ పూజయామి(వెంట్రుకలు)

31) ఓం పద్మనాభాయ నమః – సహస్రారం పూజయామి (బ్రహ్మరంధ్రం)

32) ఓం త్రిమూర్తి స్వరూపాయ నమః – సర్వాణ్యంగాని పూజయామి (సర్వావయవాలు అంతటా)

ఈ నామావళి చెప్పునప్పుడు పుష్పములు లేదా అక్షతలు ఉపయోగించవచ్చు. విశేషంగా చేయదలిస్తే సమయాన్ని బట్టి అష్టోత్తర నామావళి లేదా సహస్ర నామావళి చెప్పుకొనవచ్చు .

**ధూపమ్ :**

శ్లో॥ వనస్పత్యుద్భవైర్దివ్యైర్నా నాగంధై స్సుసంయుతః ।
ఆఘ్రేయస్సర్వదేవానాం, ధూపోయం ప్రతిగృహ్యతామ్॥

శ్రీ గోవిందమాంబాసమేత శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామినే నమః ధూపమాఘ్రాపయామి.

(పై మంత్రముతో అగరుబత్తీలు వెలిగించి మంటను ఆర్పి ధూపం మాత్రము చూపవలెను)

**ఘంటానాదం :**

శ్లో ॥ వేదాది వర్ణ సంభూతం నాదరూపం నిరామయమ్ ।
అజ్ఞాన తిమిరస్యార్కం శ్రావయామి ఘంటారవం ॥ .

శ్రీ గోవిందమాంబాసమేత శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామినే నమః ఘంటానాదం శ్రావయామి .

(పై మంత్రముతో ఘంటను మ్రోగించవలెను)

**దీపమ్ :**

శ్లో॥ సాజ్యం త్రివర్తి సంయుక్తం వహ్నినా యోజితం ప్రియమ్।
గృహాణ మంగళం దీపం త్రైలోక్య తిమిరాపహా ।
భక్త్యా దీపం ప్రయచ్ఛామి దేవాయ పరమాత్మనే ।
త్రాహిమామ్ నరకాత్ ఘోరాత్ దివ్యజ్యోతిర్న మోస్తుతే ॥

శ్రీ గోవిందమాంబాసమేత శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామినే నమః దీపం దర్శయామి

(పై మంత్రముతో దీపారాధన వద్ద అక్షతలు పుష్పమును ఉంచి నమస్కరించ వలెను)

**నైవేద్యము :**

ఓం భూర్భువస్సువః తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి ధియో యోనః ప్రచోదయాత్ ॥

ఉదయం : సత్యం త్వర్తేన పరిషించామి. అనీ

సాయంత్రం : ఋతంత్వా సత్యేన పరిషించామి. అనీ చెప్పవలెను

అమృతమస్తు అమృతోపస్థిరణమసి శ్రీ గోవిందమాంబాసమేత శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామినే నమః

(......పదార్థం పేరు) నైవేద్యం సమర్పయామి.

(పై మంత్రమతో స్వామి వారి ముందున్న నివేదన పదార్థములపై నీరు తమలపాకుతో చల్లవలెను)

"ఓం ప్రాణాయ స్వాహా, ఓం అపానాయస్వాహా, ఓం వ్యానాయ స్వాహా, ఓంఉదానాయస్వాహా, ఓం సమానాయ స్వాహా, మధ్యే మధ్యే పానీయం సమర్పయామి. అమృతాపిధానమసి ఉత్తరాపోశనం సమర్పయామి హస్తౌప్రక్షాళయామి, పాదౌ ప్రక్షాళయామి శుద్ధాచమనీయం సమర్పయామి.

(పై స్వాహాకార మంత్రములు ఉచ్చరిస్తూ స్వామి వారికి నివేదన పదార్థములను ఆకుతోచూపవలెను. మరలా పదార్థములపై నీరు చల్లి, స్వామి పాదములపై మరియు ప్రక్కన నీరు కొంచెం చల్లవలెను)

**తాంబూలము :**

శ్లో ॥ ఓం పూగీఫలైస్స కర్పూరైర్ నాగవల్లీ దళైర్యుతమ్ ।
ముక్తా చూర్ణ సమాయుక్తం తాంబూలం ప్రతిగృహ్యతామ్॥

శ్రీ గోవిందమాంబాసమేత శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామినే నమః దక్షిణాఫల సహిత తాంబూలం సమర్పయామి.

(పై మంత్రముతో స్వామి వారికి ఫల, పుష్ప, సహిత తాంబూలం సమర్పించి నమస్కరించాలి)

**కర్పూరం :**

ఓం హిరణ్య పాత్రం మధోఃపూర్ణం దదాతి। మధవ్యో సానీతి। ఏకధా బ్రహ్మణ ముపహరతి। ఏకదైవ యజమాన ఆయుస్తేజో దధాతి। సామ్రాజ్యం భోజ్యం స్వారాజ్యం వైరాజ్యం పారమేష్ఠిగ్ం రాజ్యం।మహారాజ్యమాధిపత్యం అయగ్ం సముద్ర పర్యాయా స్యాత్సర్వభౌమాస్సార్వాయుషా । ధాతా పరార్ధా పృధివీ సముద్ర పర్యంతాయా । ఏకరాడితి యశస్కరం బలవంతం ప్రభుత్వం త్వమేవ రాజ్యాధిపతిర్బభూవ సంకీర్ణ నాగాశ్వపతిర్నరాణాం । సుమంగల్యం సతతం దీర్ఘమాయుః ॥

శ్రీ గోవిందమాంబా సమేత శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామినే నమః ఆనంద కర్పూర దివ్య మంగళనీరాజనం దర్శయామి.

(కర్పూరంవెలిగించి ముమ్మారుత్రిప్పుచూ ఎడమ చేతితో ఘంటను మ్రోగించి , ఏకార్తైపై కొంచెంనీటిని చల్లి స్వామి వారికి కుడి చేతితో అద్ది తదుపరి హారతిని అద్దుకొనవలెను).

**ధ్యానం :**

శ్రీ కళ్యాణ గుణావహం శుభకరం శీతాద్రిజా మాతరం
దాతారం బహుసంపదాం భవహరం తాపత్రయోన్మూలినం
భక్తానామమరద్రుమం పురహరం పాపాటలీపావకం
వీరబ్రహ్మసదాశివం హృదిభజే వేదాంతవేద్యం పరమ్ ॥
వీరబ్రహ్మలలితం వీర ప్రభావం
సురముని సహితం సూర్యఖండాం సుధారిం
రిపుగణ హరం సద్భక్త రక్షం
పరశివగురురూపం గోవిందమాంబాసమేతం ॥

**మంత్రపుష్పం :**

ఓం॥ ధాతా పురస్తాద్యముదాజహారా ।
శక్రః ప్రవిద్వాన్ ప్రదిశశ్చ తస్రః ।
తమేవం విద్వానమృత ఇహ భవతి ।
నాన్యః పంథా అయనాయ విద్యతే ॥

ఓం సహస్ర శీర్షం దేవం విశ్వాక్షం విశ్వశంభువమ్ ।
విశ్వం నారాయణందేవ మక్షరం పరమం పదమ్ ॥ 1
విశ్వతః పరమా న్నిత్యం విశ్వం నారాయణగ్ం హరిమ్ ।
విశ్వ మేవేదం పురుషస్తద్విశ్వ ముపజీవతి ॥ 2
పతిం విశ్వస్యాత్మేశ్వరగ్ం శాశ్వతగ్ం శివ మచ్యుతమ్ ।
నారాయణం మహాజ్ఞేయం విశ్వాత్మానం పరాయణమ్ ॥ 3
నారాయణపరో జ్యోతిరాత్మా నారాయణః పరః ।
నారాయణ పరం బ్రహ్మ తత్త్వం నారాయణః పరః ।
నారాయణ పరో ధ్యాతా ధ్యానం నారాయణః పరః ॥ 4
యచ్చకించి జ్జగత్సర్వం దృశ్యతే శ్రూయతేఽపివా ।
అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః ॥ 5
అనంత మవ్యయం కవిగ్ం సముద్రేఽంతం విశ్వశంభువమ్।
పద్మకోశ ప్రతీకాశగ్ం హృదయం చాప్యధోముఖమ్ ॥ 6
అధోనిష్ట్యా వితస్యాన్తే నాభ్యాముపరితిష్ఠతి ।
జ్వాలమాలాకులంభాతి విశ్వస్యాయతనం మహత్ ॥ 7

సంతతగ్ం శిలాభిస్తు లంబత్యాకోశసన్నిభమ్ ।
తస్యాన్తే సుషిరగ్ం సూక్ష్మం తస్మిన్ సర్వం ప్రతిష్ఠితమ్ ॥ 8
తస్య మధ్యే మహానగ్ని ర్విశ్వార్చి ర్విశ్వతో ముఖః ।
సోఽగ్రభుగ్విభజన్ తిష్ఠ న్నాహార మజరః కవిః ।
తిర్యగూర్ధ్వ మధశ్శాయీ రశ్మయ స్తస్య సంతతా ॥ 9
సంతాపయతి స్వం దేహ మాపాదతల మస్తకః ।
తస్య మధ్యే వహ్ని శిఖా అణీయోర్ధ్వా వ్యవస్థితః ॥ 10
నీలతో యదమధ్యస్థా ద్విద్యుల్లేఖేవ భాస్వరా ।
నీవారశూకవత్తన్వీ పీతాభా స్వత్యణూపమా ॥ 11
తస్యా శ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః ।
స బ్రహ్మస్స శివస్స హరిస్సేంద్ర స్సోఽక్షరః పరమస్స్వరాట్ ॥ 12
రాజాధిరాజాయ ప్రసహ్య సాహినే ।
నమో వయం వైశ్రవణాయ కుర్మహే ।
స మే కామా న్కామ కామాయ మహ్యమ్ ।
కామేశ్వరో వైశ్రవణో దదాతు ।
కుబేరాయ వైశ్రవణాయ మహారాజాయ నమః ॥ 13

ఓం తద్బ్రహ్మ । ఓం తద్వాయుః । ఓం తదాత్మా । ఓం తత్సత్యం ।
ఓం తత్సర్వం । ఓం తత్పురోర్నమః ।
అంతశ్చరతి భూతేషు గుహాయాం విశ్వమూర్తిషు ।
త్వం యజ్ఞస్త్వం వషట్కారస్త్వమింద్రస్త్వగ్ం
రుద్రస్త్వం విష్ణుస్త్వం బ్రహ్మత్వం ప్రజాపతిః ।
త్వం తదాప ఆపో జ్యోతీ రసోఽమృతం
బ్రహ్మ భూర్భువస్సువరోమ్ ॥ 14
ఈశాన స్సర్వ విద్యానామీశ్వరస్సర్వభూతానాం
బ్రహ్మాఽధిపతి ర్బ్రహ్మణోఽధిపతి ర్బ్రహ్మ శివో మే అస్తుసదా శివోమ్॥ 15

## నమస్కారం :

ఓం యానికానిచ పాపాని । జన్మాంతర కృతానిచ ।
తాని తాని ప్రణశ్యంతి । ప్రదక్షిణ పదేపదే ॥
భవత్స్మరణ మాత్రేణ । శుద్ధాత్మాస్మి మహామయ ।
త్రాహిమాం కృపయాదేవ । శరణాగత వత్సల ॥
అన్యథా శరణం నాస్తి । త్వమేవ శరణం మమ ।
తస్మాత్కారుణ్యభావేన । రక్ష రక్ష జగద్గురో ॥

శ్రీ గోవిందమాంబా సమేత శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామినే నమః
ఆత్మప్రదక్షిణ త్రయనమస్కారాన్ సమర్పయామి.

(పై మంత్రముతో ముమ్మారు ప్రదక్షిణ చేసి నమస్కరించవలెను.)

**సాష్టాంగ నమస్కారం :**

ఉరసా, శిరసా, దృష్ట్వా మనసా వచసా, తథా ।
పద్భ్యాం కరాభ్యాం కర్ణాభ్యాం ప్రణమో అష్టాంగ ఉచ్యతే॥

పొట్ట, తల, కన్నులు, మనస్సు, వాక్కు, కాళ్ళు, చేతులు, చెవులు, ఈ ఎనిమిది అంగములతో శరీరాన్ని నేలకు తాకిస్తూ మనసారా భగవంతుని ముందు సాగిలపడి చేసే నమస్కారమును సాష్టాంగ నమస్కారం అంటారు. పై చెప్పిన నమస్కార అనంతరం ఈ సాష్టాంగ నమస్కారం చేయాలి.

**పునః పూజ :**

భగవంతుని మనం సాదరంగా ఆహ్వానించాం అలాగే సాదరంగా సాగనంపాలి. దానికి ముందు అర్చించాలి. అందుకే ఈ పునఃపూజ, ఆయొక్క భగవంతునికి సమస్త రాజలాంఛనములతో దివ్యోపచారాలతో సేవించాలి.

శ్రీ గోవిందమాంబా సమేత శ్రీవీరబ్రహ్మేంద్ర స్వామినే నమః

ఛత్రం ఆచ్ఛాదయామి, ఛామరాం వీజయామి, నృత్యం దర్శయామి, గీతం శ్రావయామి, ఆందోళికాం ఆరోహయామి, గజాన్ ఆరోహయామి, అశ్వాన్ ఆరోహయామి, రధాన్ ఆరోహయామి, సమస్త రాజోపచార దేవోపచార శక్త్యోపచార భక్త్యోపచార మానసోపచార పూజాం సమర్పయామి.

(పై మంత్రముతో అక్షతలు ఉంచి నమస్కరించాలి.)

**పరిపూర్ణం :**

యస్య స్మృత్యాచనామోక్త్యా । తపః పూజా క్రియాదిషు ।
న్యూనం సంపూర్ణతాం యాతి । సద్యోవందే పరాత్పరా ।
మంత్రహీనం, క్రియాహీనం, భక్తిహీనం పరాత్పరా
యత్పూజితం మయా దేవ । పరిపూర్ణం తదస్తుతే ॥

(పై మంత్రముతో స్వామివారిని పూజలో ఏమైన తప్పులుంటే మన్నించమని ప్రార్థించాలి.)

**ప్రసాద స్వీకరణ :**

అనయా ధ్యానా వాహనాది షోడశోపచార పూజయాచ, భగవాన్ సర్వాత్మకః,

శ్రీ గోవిందమాంబా సమేత శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామినే నమః
సుప్రీతా సుప్రసన్నాః వరదా భవతు ॥

(పై మంత్రము ఉచ్ఛరిస్తూ ఉత్తరం వైపు తమలపాకు వేసి అందులో అక్షతలు నీరు కొంచెంగా విడచి పెట్టి స్వామివారి పాదములవద్ద ఉన్న పూజా పుష్ప, అక్షతలను తలపై ఉంచుకోవలెను.

## తీర్థ ప్రసాద స్వీకరణం :

శ్లో॥ అకాల మృత్యుహరణం సర్వ వ్యాధి నివారణం సమస్త పాప క్షయకరం ।

శ్రీ గోవిందమాంబా సమేత శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామి దివ్య పాదోదకం పావనం శుభం॥

(పై మంత్రముతో తీర్థము,/ ప్రసాదము పుచ్చుకొనవలెను, ఇతరులకు పంచవలెను.

## పాదుకల (శఠారి)మంత్రం :

శ్లో ॥ ఓం హిరణ్య గర్భాది సురాసురాణాం కిరీట మాణిక్య విరాజమండితం ।

శ్రీ వీరబ్రహ్మ చరణారవింద యుగళం తదీయ మూర్ధానమలంకరోతు ॥

## శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామివారి చూర్ణిక

శ్రీమద్రాజాధిరాజ, రాజపరమేశ్వర, రాజచూడామణి, పంచరాజ, బహురాజ, పరమరాజ, రాజోత్తమ, చరాచరజగత్ సంతాన, సముచ్చారణ, సంకల్ప, నిర్గుణ, నిర్వికల్ప, బహుగుణ, ప్రకల్పిత, ప్రకృతిరూప, సహస్రరూప, సర్వరూప, సదానంద స్వరూపులైన, అంతర్యోగ, బహిర్యోగ, ప్రకృతి యోగ, పరమయోగ, భావయోగ, భక్తి యోగ, ప్రకటయోగ, పాలనయోగ, ప్రపంచకయోగ, వియోగులైన, । విద్యాత్మ, వేదాత్మ, వివిధాత్మ, విచిత్రాత్మ, జీవాత్మ, నిర్జీవాత్మ, పూర్ణాత్మ, శతాత్మ, అనంతాది, సర్వాత్మ నాయకులైన, । కుటిలసాగర, గుణసాగర, అగ్నిసాగర, సోమసాగర, సూర్యసాగర, సర్వసాగర, మహాసాగర, అర్థివంతులైన, । ప్రణవాక్షరపాలనశీల, విశాలకులగోత్ర, మిత్ర, అమిత్ర, చిత్ర, విచిత్ర, వీరపురుషాధిఖ్యాత నానానామకులైన, । త్రేతాండయోగ, అజాండయోగ, సర్వాండయోగ, వీరశక్తుండ, అవియోగ పురుషకుపురుష, సత్పురుష, నిరుపమ, పరమ పురుష,

నిర్వికార, నిరంజన, నిగమవేద్య, నిఖిలాంతర్వాస, నిష్కళంక, నిర్వాణ, నిర్వికల్ప, వికల్పవినోద నాదమోదితులైన, । మహితహర, దురితహర, తామసహర, దైత్యహర, గుణహర, అజహర, అండజహర, హరణమేకో నారాయణ నామక, సోమవంశోత్తమ తేజ, వీరభోజరాజ, మహారాజ రాజ ముఖాంతరాది, దశావతార విహార ప్రకాశ, అనంతావతారప్రకాశ, అత్యంత విహార, వీరనారసింహనామ, ఖండాగ్రశేఖర, భీమప్రతాప, అఖండ నాయకులైన, । దివ్యగణ, దేవగణ, మునిగణ, శక్తిగణ,సౌమ్యగణ, అవతారగణ, అఖిలగణ, అఖిలశక్తిగణ, పరమగణ, సుగుణ సంపన్నులైన, । అనంతవేద రహస్యజ్ఞాత, విఖ్యాత చరిత్ర, పవిత్రాంగ సత్యస్వరూపులైన, । నిత్యానంద, కృత్రిమావతార, విహార, అత్యంత, గోప్య, గూఢజన్మప్రకాశ, కారణజన్మ, కార్యాంగధార్య, ఆర్యసేవాధురీణులైన, । అంతరంగ, ఆత్మసంగ, బహి ప్రకాశ, ప్రపంచకసంగ, నిస్సంగ, సంగమధ్వంసక, హంసావతార, వీరపురుష సేవాంతరంగ, శ్రీగురవే నమః ॥

ఓమ్ శ్రీగురుభ్యోనమః

## శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామి అష్టోత్తర శతనామావళిః

ఓం వీరబ్రహ్మయోగీంద్రాయ నమః

ఓం స్వప్రకాశాయ నమః

ఓం శివంకరాయ నమః

ఓం అంతర్ముఖసమారాధ్యాయ

ఓం శ్రీమతే నమః

ఓం సర్వజగద్గురవే నమః

ఓం వీరనారాయణాయ నమః

ఓం అభేద్యాయ నమః

ఓం త్రయీమార్గప్రవర్తకాయ నమః

ఓం సూర్యమండల మధ్యస్థాయ నమః 10

ఓం సర్వయోగీశ్వరేశ్వరాయ నమః

ఓం ప్రసన్నవదనాంభోజాయ నమః

ఓం సర్వాతీతాయ నమః

ఓం సనాతనాయ నమః

ఓం అజ్ఞానతిమిరాదిత్యాయ నమః
ఓం ప్రజ్ఞానాయ నమః
ఓం ప్రకృతా పరాయ నమః
ఓం అనాదయే నమః
ఓం అద్వయాయ నమః
ఓం అచింత్యాయ నమః 20
ఓం సునాదాతీత విగ్రహాయ నమః
ఓం అనిలాయ నమః
ఓం నిస్పృహాయ నమః
ఓం అఖండాయ నమః
ఓం సుసం వేద్యాయ నమః
ఓం స్వయంప్రభవే నమః
ఓం అష్టపాశ వినిర్ముక్తాయ నమః
ఓం శిష్టాభీష్ట ప్రదాయకాయ నమః
ఓం అతీంద్రియజ్ఞాననిధయే నమః
ఓం సర్వతంత్రస్వతంత్రకాయ నమః 30

ఓం చిద్రూపాయ నమః
ఓం చిన్మయాయ నమః
ఓం అవ్యక్తాయ నమః
ఓం సంసారార్ణవతారకాయ నమః
ఓం చిదానందాయ నమః
ఓం మహాతేజాయ నమః
ఓం సాక్షాద్విష్ణుస్వరూపధృతే నమః
ఓం జితేంద్రియాయ నమః
ఓం తతాయ నమః
ఓం స్థాణవే నమః 40
ఓం మహాపాతకనాశనాయ నమః
ఓం చిన్ముద్రాఙ్చితహస్తాబ్జాయ నమః
ఓం నిర్ణిద్రాయోగరూపకాయ నమః
ఓం నాదబిందుకళాతీతాయ నమః
ఓం సర్వతీర్థకరాయ నమః
ఓం అద్భుతాయ నమః

ఓం నిర్వికల్పాయ నమః
ఓం నిరాకారాయ నమః
ఓం నిరపేక్షాయ నమః
ఓం నిరాశ్రయాయ నమః 50
ఓం నిరామయాయ నమః
ఓం నిరాలంబాయ నమః
ఓం సర్వసారాయ నమః
ఓం సదాశుచయే నమః
ఓం నిష్కామాయ నమః
ఓం సద్ఘనాయ నమః
ఓం అనంతాయ నమః
ఓం నిష్కళంకాయ నమః
ఓం నిరింద్రియాయ నమః
ఓం నిర్మలాయ నమః 60
ఓం నిగమాభేద్యాయ నమః
ఓం నిర్మాయాయ నమః

ఓం నిస్సమాధికాయ నమః

ఓం నిశ్చలాయ నమః

ఓం నిష్క్రియాకారాయ నమః

ఓం నిరసూయాయ నమః

ఓం నిరంజనాయ నమః

ఓం పరేశాయ నమః

ఓం పరమానందాయ నమః

ఓం పరమార్థప్రకాశకాయ నమః 70

ఓం పరతత్త్వాయ నమః

ఓం సురారాధ్యాయ నమః

ఓం పరంజ్యోతిషే నమః

ఓం పరాత్పరాయ నమః

ఓం భగవతే నమః

ఓం సర్వసారజ్ఞాయ నమః

ఓం సర్వపూర్ణాయ నమః

ఓం సునిశ్చితాయ నమః

ఓం మహామూర్తయే నమః
ఓం మహాదీప్తయే నమః
ఓం మహాలక్ష్మీవరప్రదాయ నమః 80
ఓం విశ్వాతీతాయ నమః
ఓం సువిఖ్యాతాయ నమః
ఓం ప్రత్యగాత్మనే నమః
ఓం విరాడ్వపుషే నమః
ఓం సుప్రసన్నాయ నమః
ఓం సత్ప్రకాశాయ నమః
ఓం షడూర్మిరహితాయ నమః
ఓం అచలాయ నమః
ఓం యమాద్యష్టాంగనిష్ణాతాయ నమః 90
ఓం శమాదిగుణ విగ్రహాయ నమః
ఓం సర్వగాయ నమః
ఓం సచ్చిదానందాయ నమః
ఓం సజాతీయాది వర్జితాయ నమః

ఓం వేదాంత వేద్యాయ నమః
ఓం శ్రీ వీరాయ నమః
ఓం శిష్యహృత్తాపహారకాయ నమః
ఓం స్వానుభూతిరసా వేశాయ నమః
ఓం సర్వభూతదయాపరాయ నమః
ఓం అప్రమేయాయ నమః 100
ఓం చిదాకాశాయ నమః
ఓం పునరావృత్తినాశనాయ నమః
ఓం నిర్గుణాయ నమః
ఓం శాశ్వతాయ నమః
ఓం అద్వైతాయ నమః
ఓం అవాఙ్మానసగోచరాయ నమః
ఓం కైవల్య కారణాతీతాయ నమః
ఓం దివ్యజ్ఞాననిదర్శనాయ నమః 108

**ఇతి శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామి అష్టోత్తర శతనామావళిః**

## శ్రీ గోవిందాంబికాష్టోత్తర శతనామావళిః

ఓం ఐం హ్రీం శ్రీం శ్రియై నమః
ఓం శ్రీ విద్యా స్వరూపిణ్యై నమః
ఓం శ్రీ ప్రదాయై నమః
ఓం కరుణార్ద్ర హృదయాయై నమః
ఓం పరమానందవిగ్రహాయై నమః
ఓం భక్తబృందపోషకాయై నమః
ఓం భక్తాభీష్టఫలప్రదాయై నమః
ఓం భక్తహృత్పద్మనిలయాయై నమః
ఓం శరణాగతరక్షకాయై నమః
ఓం సకలలోకకర్త్యై నమః 10
ఓం సకలలోకపాలిన్యై నమః
ఓం సకలలోకసాక్షిణ్యై నమః
ఓం సకలలోకాతీతాయై నమః
ఓం సకలలోకజనన్యై నమః

ఓం సకలలోకమోహిన్యై నమః
ఓం సకలభయనివారిణ్యై నమః
ఓం సకలలోకశరణ్యాయై నమః
ఓం సకలలోకపూజితాయై నమః
ఓం సకలపాపహరిణ్యై నమః
ఓం సిద్ధసేవిత చరణాంబురుహాయై నమః 20
ఓం సిద్ధసౌఖ్యప్రదాయిన్యై నమః
ఓం కందిమల్లయపురాధీశ్వర్యై నమః
ఓం వీరాచార్యకుంటుంబిన్యై నమః
ఓం దివ్యమంగళాకృత్యై నమః
ఓం సామగానప్రియాయై నమః
ఓం రాజరాజేశ్వర్యై నమః
ఓం మహారాజసంస్తుతాయై నమః
ఓం ఆత్మయజ్ఞప్రియాయై నమః
ఓం సత్యధర్మప్రకాశిన్యై నమః
ఓం అజ్ఞానతిమిరభాస్కరాయై నమః 30

ఓం అమోఘచరితాయై నమః
ఓం శుద్ధసంకల్పాధారాయై నమః
ఓం సంసారతాపభంజనాయై నమః
ఓం కళ్యాణగుణగరిష్ఠాయై నమః
ఓం మోక్షసామ్రాజ్యదాయక్యై నమః
ఓం అద్వైతరహస్యాంతరంగికాయై నమః
ఓం హంసతత్వవివేచనాయై నమః
ఓం పరిపూర్ణభావాతీతాయై నమః
ఓం యోగముద్రాన్వితాయై నమః
ఓం యోగలక్ష్యార్థాయై నమః 40
ఓం యోగ సిద్ధిప్రదాయై నమః
ఓం యోగీశ్వరేశ్వర్యై నమః
ఓం సనురసభావజ్ఞాయై నమః
ఓం సర్వకాలనియంత్ర్యై నమః
ఓం సర్వజనమనోరంజన్యై నమః
ఓం సర్వభూతదయానిధయై నమః

ఓం అభయప్రదహస్తపల్లవాయై నమః
ఓం నిత్యస్వతంత్రమానసాయై నమః
ఓం సద్బోధాధారాయై నమః
ఓం సదాచారసమన్వితాయై నమః 50
ఓం సదాప్రసన్నముఖపద్మాయై నమః
ఓం శాశ్వతైశ్వర్యసుఖదాయిన్యై నమః
ఓం దుస్స్వప్ననివర్తకాయై నమః
ఓం ఆదిమధ్యాంతశూన్యాయై నమః
ఓం జపలక్ష్యార్థతత్వాయై నమః
ఓం ప్రత్యగ్రూపప్రదర్శికాయై నమః
ఓం శుద్ధసత్వప్రధానశక్త్యై నమః
ఓం రాజయోగీశ్వరప్రియాయై నమః
ఓం సర్వాధారశక్త్యై నమః
ఓం నిర్గుణబ్రహ్మానందలహర్యై నమః 60
ఓం వీరేశ్వరనిత్యసేవిన్యై నమః
ఓం వీరేంద్రమనః ప్రియాయై నమః

ఓం ఈశ్వరాంబికాపితామహ్యై నమః

ఓం భేదాభేదరహితాయై నమః

ఓం మహావాక్యనిదానాయై నమః

ఓం జ్ఞానవైరాగ్యగోచరాయై నమః

ఓం పరబ్రహ్మసంయుక్తాయై నమః

ఓం చిత్కళాసాక్షాత్కారాయై నమః

ఓం గోవిందస్వరూపిణ్యై నమః

ఓం గురుశ్రేష్ఠాయై నమః 70

ఓం పునర్భవభయాపహారిణ్యై నమః

ఓం వేదాంతసారాయై నమః

ఓం సృష్టిస్థితిలయాధారాయై నమః

ఓం అనంతసౌఖ్యావహాయై నమః

ఓం అనంతావతారాయై నమః

ఓం మూలధారమంజీరాయై నమః

ఓం స్వాధిష్టానకింకిణీయుత మేఖలాయై నమః

ఓం మణిపూరక కాంచీకలాపాయై నమః

ఓం అనాహతరత్న భూషితాయై నమః

ఓం కంఠవిరాజిత విశుద్ధమంగళసూత్రాలంకృతాయై నమః 80

ఓం భ్రూమధ్యాంచితాజ్ఞా చక్రలలాటికాశోభితాయై నమః

ఓం సూర్యచంద్రతాటంకయుగళవిభ్రాజితాయై నమః

ఓం సౌదామనీలతాశరీరిణ్యై నమః

ఓం శుద్ధసత్వదూకూలావృతాయై నమః

ఓం అఖండచంద్రవదనాయై నమః

ఓం జ్ఞానవిజ్ఞానలోచనాంబురుహాయై నమః

ఓం యశఃకస్తూరీగంధలిప్తాంగ్యై నమః

ఓం శమాదిపుష్పమాలావిరాజమానాయై నమః

ఓం దుర్నిరీక్ష్యకళాభాసమానాయై నమః

ఓం సుషుమ్నాంతః పురనివాసిన్యై నమః 90

ఓం హంసయానాయై నమః

ఓం వీరబ్రహ్మేంద్రార్ధశరీరిణ్యై నమః

ఓం బ్రహ్మాదిదేవసన్నుతాయై నమః

ఓం సచ్చిదానందమయ్యై నమః

ఓం గోవిందార్యాది పంచతనూజవత్యై నమః

ఓం షడ్వర్గ విదారిణ్యై నమః

ఓం సహస్రదళ కమలాధిష్ఠానాయై నమః

ఓం ఆమ్నాయవేద్యాయై నమః

ఓం పంచకోశాతీతాయై నమః

ఓం సర్వమంత్రాధిష్ఠానదేవ్యై నమః 100

ఓం మహాశక్త్యై నమః

ఓం సర్వమంత్రాత్మికాయై నమః

ఓం మహాదోషవిదూరాయై నమః

ఓం ఆదిదేవ్యై నమః

ఓం సత్యతత్వబోధకాయై నమః

ఓం సత్యతత్వవివేచన్యై నమః

ఓం శ్రీ వీరబ్రహ్మేంద్రప్రాణేశ్వర్యై నమః

ఓం శ్రీ గోవిందాంబికాయై నమః 108

**ఇతి గోవిందాంబికా ష్టోత్తర శతనామావళిః**

## శ్రీ గోవిందాంబా ద్వాత్రింశన్నామావళిః

ఓం ఐం హ్రీం శ్రీం శ్రీ గోవిందాంబికాయై నమః
ఓం ఐం హ్రీం శ్రీం పరమకళాస్వరూపిణ్యై నమః
ఓం ఐం హ్రీం శ్రీం నిత్యమంగళ విగ్రహాయై నమః
ఓం ఐం హ్రీం శ్రీం సదాచార సమన్వితాయై నమః
ఓం ఐం హ్రీం శ్రీం త్రికూటసరసీస్నానశోభితాయై నమః
ఓం ఐం హ్రీం శ్రీం దివ్యదుకూలధారిణ్యై నమః
ఓం ఐం హ్రీం శ్రీం కస్తూరీమిళితగంధలిప్తాంగ్యై నమః
ఓం ఐం హ్రీం శ్రీం శమాదిభూషణాయై నమః
ఓం ఐం హ్రీం శ్రీం సత్యజ్ఞానానంద హృదయాయై నమః
ఓం ఐం హ్రీం శ్రీం ప్రసన్న ముఖాంబురుహాయై నమః
ఓం ఐం హ్రీం శ్రీం దివ్యపుష్పమాలావిరాజమానాయై నమః
ఓం ఐం హ్రీం శ్రీం షడ్వర్గాంధ తమోభాస్కరాయై నమః
ఓం ఐం హ్రీం శ్రీం వీరేశ్వరమనఃప్రియాయై నమః
ఓం ఐం హ్రీం శ్రీం సహస్రారాంబుజనిలయాయై నమః
ఓం ఐం హ్రీం శ్రీం వికచాఽరవింద లోచనాయై నమః
ఓం ఐం హ్రీం శ్రీం కందిమల్లేశ్వరనికేతనాధీశ్వర్యై నమః

ఓం ఐం హ్రీం శ్రీం సిద్ధహృత్తాపభంజనాయై నమః
ఓం ఐం హ్రీం శ్రీం వేదవేదాంతగమ్యాయై నమః
ఓం ఐం హ్రీం శ్రీం షట్పద్మదళసంచారిణ్యై నమః
ఓం ఐం హ్రీం శ్రీం సురారాధ్యాయై నమః
ఓం ఐం హ్రీం శ్రీం దివ్యమోక్షసామ్రాజ్యవిభవాయై నమః
ఓం ఐం హ్రీం శ్రీం యోగీంద్రపోషకాయై నమః
ఓం ఐం హ్రీం శ్రీం భక్తహృత్పద్మసంలీనాయై నమః
ఓం ఐం హ్రీం శ్రీం సర్వసంపత్ప్రదాయై నమః
ఓం ఐం హ్రీం శ్రీం సర్వపాపవిదారిణ్యై నమః
ఓం ఐం హ్రీం శ్రీం సర్వలోకపూజితాయై నమః
ఓం ఐం హ్రీం శ్రీం సర్వభయనివారిణ్యై నమః
ఓం ఐం హ్రీం శ్రీం మునిశ్రేష్ఠపూజితాంఘ్రికుశేశయాయై నమః
ఓం ఐం హ్రీం శ్రీం అభయప్రదహస్తపల్లవాయై నమః
ఓం ఐం హ్రీం శ్రీం శ్రీ వీరబ్రహ్మేంద్రప్రాణేశ్వర్యై నమః
ఓం ఐం హ్రీం శ్రీం సకలలోకపాలిన్యై నమః
ఓం ఐం హ్రీం శ్రీం లోకరక్షణదీక్షాబద్ధకంకణ హస్తాబ్జాయై నమః

**ఇతి శ్రీగోవిందాంబికా ద్వాత్రింశన్నామావళిః**

## శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామి మంగళ హారతి

అఖిల చరాచరమంత నీవగుచును సకల రూపులతోడ సంచరించి
అకలంక మగుదశయవతారముల దాల్చి సకలలోకములేలు సద్గురు స్వామి
మంగళం మంగళం వీరబ్రహ్మం మంగళం మంగళం
వీరప్పయ్యను పేర జేరి బనగానపల్లెలో కారణమూర్తివై ఘనత తోడ
గరిమిరెడ్డి అచ్చమ్మ గారిని మన్నించి కోరి అన్నాజయ్య కోర్కెదీర్చిన స్వామి
మంగళం మంగళం వీరబ్రహ్మం మంగళం మంగళం
త్రైకాలికాగత ధర్మములను దెల్పి శ్రీ కాలజ్ఞానమున వాకొనియు
ప్రాకటముగ భక్తానీకము బ్రోచిన సాకార బ్రహ్మ శ్రీ సద్గురు దేవా
మంగళం మంగళం వీరబ్రహ్మం మంగళం మంగళం
అల్లాడు పల్లెలో హరిపోతులూరయ్య వల్ల పరిపూర్ణము కొల్లలాడి
కల్లకలిదోషము లెల్ల దూరము చేయ కలికియౌ కందిమల్లయ పురవాసా
మంగళం మంగళం వీరబ్రహ్మం మంగళం మంగళం
గోవిందమాంబను కోరికతో వరియించి నీవు సంసారాన నిలిచినావు
దేవాదులకు నీవు దేవుడవగుచును భావింపగ వీరబ్రహ్మమౌ నీకు
మంగళం మంగళం వీరబ్రహ్మం మంగళం మంగళం
బాల సిద్ధుని పిలిచి భావంబు రంజిల్లు అమనస్క యోగంబు నంద జేసి
నమ్మిన వారల సమ్మతితో బ్రోచి నిండు సమాధిలో నిలచినదేవా
మంగళం మంగళం వీరబ్రహ్మం మంగళం మంగళం.

## శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామివారి పురమున జరుగు కార్యక్రమములు

**వైశాఖ శుద్ధ దశమి :** శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామివారి ఆరాధన శ్రీవీరబ్రహ్మేంద్ర స్వాములవారు సజీవ యోగసమాధి చెందిన పవిత్రసుదినం (ప్రస్తుతం, 2019–326వ)

**ఆషాఢ శుద్ధ పూర్ణిమ :** గురుపూజా మహోత్సవము జరుగును.

**ఆశ్వయుజ శుద్ధ పాడ్యమి నుండి ఆశ్వయుజ శుద్ధ ఏకాదశి వరకు:** శ్రీదేవీ శరన్నవరాత్రోత్సవములు

**కార్తీక శుద్ధ ఏకాదశి నుండి కార్తీక శుద్ధ త్రయోదశి వరకు :** శ్రీ వీరబ్రహ్మేంద్రస్వాములవారి జయంత్యుత్సవాలు (ప్రస్తుతం, 2019–411వది)

**కార్తీక శుద్ధ ద్వాదశి :** శ్రీ స్వామివారి అవతరణ పవిత్ర సుదినం కావున రాత్రికి – విశ్వ శాంతి కల్యాణ మహోత్సవము జరుగును.

**మార్గశిర బ॥ నవమి :** శ్రీ వీరబ్రహ్మేంద్రస్వాముల వారి పౌత్రి శ్రీ ఈశ్వరీదేవి ఆరాధన మహోత్సవము

**పుష్య శుద్ధ ఏకాదశి :** ముక్కోటి ఏకాదశి ( వైకుంఠ ఏకాదశి )

**మాఘ శుద్ధ త్రయోదశి :** మహాశివరాత్రి శ్రీగోవిందమాంబ శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామివారి కల్యాణ మహొూత్సవము

**ఫాల్గుణ బ॥ దశమి :** శ్రీ గోవిందమాంబా అమ్మవారి ఆరాధనోత్సవము

## యాత్రికులు బ్రహ్మంగారి మఠంలో చూడదగిన ప్రదేశములు

1. శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వాముల వారి సజీవ యోగసమాధి (మఠం)
2. శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వాములవారు నివసించిన గృహము
3. శ్రీ రామాలయం ( భజన మందిరము )
4. శ్రీ వీరబ్రహ్మేంద్రాశ్రమం (స్వగృహం రోడ్డులో)
5. శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామి పోలేరమ్మ చేత నిప్పు తెప్పించిన రచ్చబండ
6. శ్రీ ఈశ్వరీదేవి మఠము
7. శ్రీ కక్కయ్య మఠము
8. నవరత్న మండపము (శ్రీగాయత్రీ విశ్వకర్మ వంశవృక్ష, 125 ఋషుల దేవాలయం)
9. శ్రీ పోలేరమ్మ గుడి
10. శ్రీయోగి అచలానంద ఆశ్రమమ్ (తోట్లపల్లె)
11. శ్రీ ఈశ్వరీదేవి తపస్సు చేసిన గుహ (4 కిమీ)
12. బ్రహ్మ సాగర్ (తెలుగు గంగ) 2 కిమీ
13. ఈ ముడుమాలలో శ్రీ సిద్దయ్యగారి మఠము (15 కి మీ)
14. అల్లాడుపల్లెలోని శ్రీవీరభద్రస్వామి ఆలయం
15. విభూతినాగలింగేశ్వరస్వామి ఆలయం (అమగంపల్లె వద్ద)